# భారతకృష్ణశతకము

రచయిత్రి:
ఉభయభాషాప్రవీ
భువనగిరి లక్ష్మీకాంతమ్మ,
సహాయాంధ్రవిదుషీమణి,
ఆంధ్ర స్త్రీ గీర్వాణకళాశాల, రాజమహేంద్రవరము.





ప్రకాశకులు:

కందర్ప సీతారామస్వామి,
దానవాయిగుంట,
రాజమహేంద్రవరము.
1933


[వెల 0—1—6

శ్రీ

# భారతకృష్ణశతకము.

రచయిత్రి:

ఉభయభాషాప్రవీణ,


## భువనగిరి లక్ష్మీకాంతమ్మ

సహాయాంధ్ర విదుషీమణి,

ఆంధ్ర స్త్రీ గీర్వాణ కళాశాల,

రాజమహేంద్రవరము.





ప్రకాశకులు:

కందర్ప సీతారామస్వామి,

దానవాయిగుంట,

రాజమహేంద్రవరము,

1933




[వెల 0—1—6

ఓం శారదాయైనమః.

# ఇష్టదేవతా ప్రార్థన.

క. శారద ! యీశతకంబున
సారతరంబైన యట్టి సంగతులను వి
స్తారముగా నిడి దీనిఁ
బూరింపుము భక్తితోడ మ్రొక్కెదఁ దల్లీ! 1

క. భారత పఠనమునుండియు
భారతకృష్ణాఖ్య నలరు పరమాత్మను నే
నారాధన మొనరింపఁగఁ
గోరికహృదయాంతరమునఁ గూడెను దల్లీ! 2

క. మనమునకును వాక్కునకును
బనికిని నందఁగ రాని· పరమాత్మకథన్
వినయమునఁ జెప్పఁబూనిన
ఘనసాహసమెల్ల నిన్నుఁగాంచియె తల్లీ ! 3

---

# కృతిసమర్పణ.

సీ. బాల్యకాలమునుండి పాయని ప్రేమతో
మమ్ములఁబెంచిన మాన్యతముఁడు
ధనహీనుఁడైనను దైన్యమొందక మాకు
సద్విద్య గఱపిన సన్నుతుండు
శారీరబలబుద్ధి సామర్థ్యములయందుఁ
బావనియనఁదగు భవ్యయశుఁడుఁ
బ్రాణమిచ్చియునైన బరులకు సాయంబు
సలుపఁగోరినయట్టి శక్తియుతుఁడు
(సద్గుణుండు.)

గీ. నైన కందర్పతిమ్మరాజాహ్వయుండు
కీర్తిశేషుండు మాతండ్రి కీర్తియుతుని
పాదపద్మములకు నాదు ప్రథమ కవిత
నర్పణముసేయుచుంటి నత్యధికభక్తి.



ఓం తత్సత్ పరమాత్మనే నమః.

# భారతకృష్ణశతకము.

క. శ్రీదేవీ సహితంబుగఁ
బ్రాదుర్భావంబునొంది ప్రతియుగమున నీ
భూధురము దీర్చువేదో
త్పాదక నినుభక్తిఁ గొలుతు భారతకృష్ణా. 1

క. వరుసను యాదవ పాండవ
వరవంశము లుద్ధరింప వాంఛను నీవే
ధరఁ గృష్ణార్జును లనఁగాఁ
బరమాత్మా! పుట్టినావు భారతకృష్ణా. 2

క. నరనారాయణులగు మీ
యిరువుర యన్యోన్యమైత్రి యింపొందఁగ నా
నరునకు నీచెలియలి నే
పరిణయ మొనరించితయ్య భారతకృష్ణా. 3

క. చండతరంబగు నుండటి
భండనమున జయముఁగోరి పానకు చేరన్
గాండీవము నిప్పించితి
పాండవమధ్యమున కీవె భారతకృష్ణా. 4

క. దుర్జయుఁడగు భార్గవుద్రథు
నిర్జించి సమస్త ధారుణీశుల చెఱ భీ
మార్జునుల సాయమున వే
వర్జింపఁగఁ జేసినావు భారతకృష్ణా. 5

క. శాంతనవుఁడు ధర్మజుని స
భాంతరమున రాజసూయ యాగార్ఘము వే
దాంతస్తుత! నీకిమ్మని
స్వాంతంబుప్పొంగఁ జెప్పె భారతకృష్ణా. 6

క. వక్రతశిశుపాలుండు త్రి
విక్రముఁడగు నిన్నుఁ బరిభవింపఁగ వానిన్
జక్రమునఁ దునిమి జన్న మ
వక్రత నెఱవేర్చి తయ్య భారతకృష్ణా. 7

క. పాతకుఁడు దుస్ససేనుఁడు
చేతఃప్రీతిగను గృష్ణ చేలములొలువన్
ఆతత వస్త్రములిచ్చితి
పాతివ్రత్యమునుగావ భారతకృష్ణా. 8

క. కడునిడుమ లొందిపాండవు
లడవులనుండఁగ నీవ యార్తావనతన్
వెడలిన నీతోఁ జెప్పిరి
పడిన యిడుమ లెల్లఁ దీర్ప భారతకృష్ణా. 9

క. ఏయే వేళలఁ గోరిన
వేయివిధంబులను బాండవేయుల నీవే
పాయక కాపాడఁగ నిర
పాయముగా నుండి రయ్య భారతకృష్ణా. 10

క. గాండీవి సుయోధనుఁడును
భండనమున సాయమునకుఁ బరమాత్మ! మిమున్
రండని పిలచినఁ జేరితి
పాండవపక్షమున నీవు భారతకృష్ణా. 11

క. కాలమువచ్చెను వీరికి
నేలా నామీఁద నింద యిపుడని యాదు
శ్శీలికిఁ బదివేవుర గో
పాలురఁ దోడిచ్చినావు భారతకృష్ణా. 12

క. సంజయుఁడు రాయబారము
నం జెప్పిన మాటలందు న్యాయము లేదం
చుం జెప్పివాని వే మను
పంజాలితి ప్రతిభ మెఱయ భారతకృష్ణా! 13

క. భారతయుద్ధం బుడుప న
పారంబగునట్టి రాయ భారమును ముదం
బార వహించితి త్రిభువన
భారము వహియించినట్లు భారత కృష్ణా. 14

క. ఇట్టి యుత్కృష్ట కార్యము
పట్టున నీయట్టివారె పనిసేయవలెన్
గుట్టెఱిఁగి నడపనేర్తువు
పట్టినకార్యంబు ధృతిని భారత కృష్ణా. 15

క. నిండిన యన్యాయము భూ
మండలమునఁబాపి ప్రజల మనిచెదవని యు
ద్దండమగు పనికి నిన్నే
పాండవు లంపించినారు భారత కృష్ణా. 16

క. వెడలితివి హస్తినగరికి
విడిది యొనర్చితివి ప్రీతి విదురునియింటన్
గడుభక్తులఁ బ్రోమించెదు
వడువునకిది సాక్షిగాదె? భారత కృష్ణా. 17

క. హితమున ధైర్యంబున సు
స్మితమునఁ బ్రియమునను నీవు చెప్పినమాటన్
మతిమంతుల కాశ్చర్యము
పతితుల కతిభీతిగల్గె భారత కృష్ణా. 18

క. అచ్చటి జనంబు లెల్లరు
నచ్చెరు వొందంగమాట లాడిన వేళన్
ముచ్చుఁడగు ధార్తరాష్ట్రుఁడు
నచ్చోఁ గట్టుటకు నిన్ను భారత కృష్ణా. 19

క. అట్టియెడ నీవువారల
నెట్టన వంచింపఁగోరి నేర్పుననుండన్
గట్టాఁ దెలియరు వా రా
పట్టున నగునట్టిచర్య భారత కృష్ణా. 20

క. దండిగ నీరూపము బ్ర
హ్మాండంబు నతిక్రమింప నాభీష్మాదుల్
నిండిన మనములఁ జూచిరి
పండెన్ మాభాగ్యమంచు భారత కృష్ణా. 21

క. దుర్నయులగు దుర్యోధన
కర్ణాదులు నీదురూపుఁ గనుగొనను జగ
త్పూర్ణుఁడవగు నినుఁ దలఁపను
వర్ణింపను నేరరైరి భారత కృష్ణా. 22

క. ధృతరాష్ట్ర భూమిపతి యం
ధతకతమున నిన్నుఁ గనుఁగొనఁగ నేరక స
న్మతిఁ బ్రార్థించిన నా భూ
పతికన్నుల నిచ్చినావు భారత కృష్ణా. 23

క. భర్తులనేనియుఁ గేవల
రక్తులనేనియును నీవు రక్షించెద వా
సక్తియు రక్తియుఁ గల్గిన
భర్తుల కే కొఱఁతఁగల్గు? భారత కృష్ణా. 24

క. కుంతి సుతుండగు కర్ణుని
కొంతయు బోధించివాని కింపుగఁ దెల్పన్
స్వాంతమున నెఱిఁగి యుండియుఁ
బంతముచేఁ జెడెనువాఁడు భారత కృష్ణా. 25

క. దారుణ సంగ్రామ మహా
భారము నొక్కఁడవె దాల్చి పార్థుని కీవే
సారథ్యము నొనరింప న
పారబలుండయ్యె నతఁడు భారత కృష్ణా. 26

క. మతిచెదరి పార్థుఁ డనిలో
హితులను బూజ్యులను జంపి యింపగు రాజ్యం
బతిసాహసమునఁ జేకొనఁ
బతితాత్ముఁడ నౌదునని మె భారత కృష్ణా. 27

క. పార్థుఁడు దెల్పిన దాన య
థార్థస్థితి దెల్పి వాని యజ్ఞానము వే
దార్థములఁ బాపి మఱి త
త్ప్రార్థనఁ గైకొంటివీవు భారత కృష్ణా. 28

క. ఫలరహిత కర్మముకు ని
ర్మలభక్తియు జ్ఞానయోగమహిమలు నీచేఁ
దెలిసికొని పార్థుఁడని లో
బలయుతుఁడై నిలిచెనయ్య భారత కృష్ణా. 29

క. నిగమాంతవేద్య! యీ ము
జ్జగములనున్నట్టి వస్తు సముదాయములోఁ
బొగడిక గల వెల్ల సుస
త్వగుణా! నీవైభవములె భారత కృష్ణా. 30

క. నిరతంబును యోగీంద్రులు
కర మనురాగమునఁ జూడఁ గాంక్షించెడు నీ
వరవిశ్వ తనువు పార్థుఁడు
పరమాహ్లాదమునఁ జూచె భారత కృష్ణా. 31

క. చేయఁగవలె సత్కర్మలఁ
బాయఁగవలె నీవు వాని ఫలమను నమృత
ప్రాయములగు నీ పల్కులు
పాయక పార్థుండు వినియె భారత కృష్ణా. 32

క. విజయుండు యుద్ధభూమికి
విజయాపజయాశవిడిచి వెడలెఁ గడంకన్
విజయులు కాకుందురె నిన్
భజియించిన వార లిలను భారత కృష్ణా. 33

క. నీవే దిక్కను నంత నె
కావంగను గంకణంబు కట్టెదు దేవా!
నీవే తానై యుండిన
కావను జేపట్టు టెంత భారత కృష్ణా. 34

క. గంగా నందనుఁ డెద ను
ప్పొంగుచు నంతనుని రీతిఁ బొలికలనికిరా
సంగతి విని భీతిని గెలు
వంగ మహాకష్టమును భారత కృష్ణా. 35

క. యమనందనుఁ డంతటఁ దా
సమరము విడనాడి వనికిఁ జనిమెద నన యు
ద్ధము సేయ ధైర్య మొసఁగితి
ప్రమదము నొందంగఁజేసి భారత కృష్ణా. 36

క. యుద్ధంబున భీష్ముఁడు క్రో
ధోద్ధతుఁడై పాండుసేన నుఱుమాడఁగ నా
పద్ధతి గని వారల కా
పద్ధైర్యం బిచ్చినావు భారత కృష్ణా. 37

క. ఉరికితివి భూమి మీఁదికి
ధరియించితి చక్రమంతఁ దడయక భీష్మున్
దురమునఁ జంపియు రాజ్యముఁ
బరఁగఁగ మీకిడుదుననుచు భారత కృష్ణా. 38

క. కలనన్ జక్రము ముట్టక
నిలిచెదనని తప్పినావు నీదు ప్రతిజ్ఞ
న్నిల నీపని పార్థుని దో
ర్బల మెక్కుడగుట కొఱకె భారత కృష్ణా. 39

క. అత్తఱి గాంగేయుఁడు తన
చిత్తంబున భక్తిగనుఱఁ జెచ్చెర నిన్నే
హత్తించెను గోవిందాది వి
షత్తులు దొలఁగంగఁ జేసి భారత కృష్ణా. 40

క. మరణించెడు కాలంబున
సరు లెవ్వారైన నిన్ను నమ్మిక తోడన్
మరువక తలఁచిన వారికిఁ
బరమాత్మా! మోక్షమిచ్చెదు భారత కృష్ణా. 41

క. తనయుని దుర్మరణంబును
విని సంతాపించు నట్టి విజయుని భార్యన్
గని తత్త్వార్థము దెల్పి య
పనయించితి దుఃఖమెల్ల భారత కృష్ణా. 42

క. కాఁగల కార్యంబంతయు
వేగమె చేయింపఁగోరి విజయుని యుద్ధో
ద్యోగమునకు నుత్సాహపు
వాగమృతము గురిసినావు భారత కృష్ణా. 43

క. జరిపితివి సైంధవాహులఁ
బరిమార్చెడివేళ లౌక్య పద్ధతి నల ము
ష్కరులను బరిమార్పఁగ యు
ర్వరపై ముఖ్యంబు నీకు భారత కృష్ణా. 44

క. పరమును నైహిక మేరికిఁ
గర మనుకూలంబొ దానిఁ గని వివరింపన్
సరి నీ కెవ్వా రిహమును
బరమును నీ కొక్కరూపె భారత కృష్ణా. 45

క. గాండీవ దూషణమున న
ఖండార్భటి నన్నఁ జంపఁ గడఁగు కిరీటిన్
మొండగు యుక్తులఁ దేర్చితి
పాండుసుతాగ్రజునిఁ బ్రోవ భారత కృష్ణా. 46

క. పెద్దల శిక్షించుట క
త్యుద్ధతి దూషణమె చాలు నుర్వినటంచీ
వెద్ది వివరించితో యా
పద్ధతి యెరుఁగఁగలరె? భారత కృష్ణా. 47

క. తనుఁ దానె పొగడు కొనుటయు
ఘనముగఁ బరనింద సేయఁ గడఁగుట నివియే
తనుఁ జంపికొనుట యను నీ
పనుపుం బార్థుండు వినియె భారత కృష్ణా. 48

క. పార్థుఁడు దూషించు నదియ
భార్థము రాజ్యమున నిలువ కరిగెద నుంచఁ
సార్థక మీమను ధర్మజుఁ
బ్రార్థించుచు నిలిపినావు భారత కృష్ణా. 49

క. నిజముగ నజయ్యుఁడనఁ దగు
విజయుఁడు యుద్ధమున మిగుల వేసారిన నీ
స్ృజన మొనర్చితి లీలగ
స్వజనము బడలికలు దీఱ భారత కృష్ణా. 50

క. ఏ యే వేళల నెయ్యది
చేయఁగవలె నో యెఱిఁగి చేసియు ధర్మో
పాయములఁ బాండవేయులఁ
బాయక కాపాడుచుండు భారత కృష్ణా. 51

క. సూతసుతుఁ దునిమి పార్థ స
మేతుఁడవై యరుగుదేర మిము ధర్మ సుతుం
డాతత భక్తిని బొగడెను
బ్రాఁతిగ నిను మదిని నిలిపి భారత కృష్ణా. 52

క. పొగడితివి మరల ధర్మజు;
సుగుణములను జెప్పుచుండి సువచన నీచే
బొగడఁబడు టెంత పూజ్యమొ
భగవానుఁడ దేవదేవ భారత కృష్ణా. 53

క. క్రూరుసుయోధను భీముని
చే రూపఱపింపఁ దలచి చెప్పితి వాకి
మ్మీరాదుల వధ యతని క
పారోత్సాహంబు వొడమ భారత కృష్ణా. 54

క. ఏ విధినైన సుయోధను
జావ నడతునని నెడుబుద్ధి చయ్యనఁ గలుగన్
ద్రోవది యవమానంబులు
పావనికిం దెల్పినావు భారత కృష్ణా. 55

క. అనిలజుఁడు ధార్తరాష్ట్రుఁడుఁ
బెనుకదలన్ బూని సమరవీథిని నిలువన్
గని వధోపాయము పా
వనికిని సూచించినావు భారతకృష్ణా. 56

క. దుర్మార్గుల శిక్షింపను
ధర్మాధర్మంబులైన తగునని నెడి లస
ద్ధర్మం బేరికి గమ్యము
వర్మమె ధర్మంబునీకు భారతకృష్ణా. 57

క. ప్రతిన నెరవేర్ప నీ భూ
పతి శిరముం దన్న; లేదు పాపంబని వా
క్చతురత ధర్మజుఁ దేర్పుమ
ప్రతి యెవ్వరు నీకు దేవ భారత కృష్ణా. 58

క. న్యాయము నిలచును ధర న
న్యాయము నశియించు నిశ్చ యని రాజులకుఁ
న్యాయమగు కీర్తి సదభి
ప్రాయము నిచ్చితివి దేవ భారత కృష్ణా. 59

క. భూపాలుని జాపుట లోఁ
బ్రాపించె నధర్మమనిన బలదేవునికిఁ
గోపము శమింపఁ జేసితి
ద్వాపర కలిసంధి యనుచు భారత కృష్ణా. 60

క. ఆలఘునఁ బడి సుయోధనుఁ
డోలి నినుం దూర దాసు నోర్చి యతని దో
షాలి నశేషము నా భూ
పాలునకుం జెప్పితివె భారత కృష్ణా. 61

క. ఘోరాహవమునఁ గౌరవ
వీరుల బాణాగ్నిఁగాలు విజయుని రథ మీ
వారసి కాచితి యుద్ధము
పారము గనునంత వఱకు భారత కృష్ణా. 62

క. కంటికి రెప్పల రీతిగ
నుంటివి పాండవుల కీవె యుత్సాహముతో
గెంటించితి శత్రుల నీ
వంటి దయారాశి గలఁడె భారత కృష్ణా. 63

క. ధృతరాష్ట్రుఁడు గాంధారియు
సుతశతమును దలఁచి యధిక శోకమునొందం
జతురతగల మాటల భూ
పతి నోదార్చితివి దేవ భారతకృష్ణా. 64

క. చతురత గంభీరత సద
యత ప్రాజ్ఞత శాంతతయును నలనడు నీ వా
క్చతురత శాంతిలచేసెను
పతిహిత గాంధారి నపుడు భారతకృష్ణా. 65

క. గాంధారి యుద్ధభూమిని
బంధుల శవములను జూచి బాష్పాన్వితయై
క్రందుగ నిను శపియించెను
బంధువులెడఁ గలుగఁ జావ భారత కృష్ణా. 66

క. విని చిఱునగవొప్పఁగ మా
నిని! చర్విత చర్వణంబు నీ శాపంబుల్
మునికథితము దీనికి నీ
పని లేదని తెల్పినావు భారతకృష్ణా. 67

క. ఉర్విని షోడశ నృపులయు
పర్వత నారదులచరిత పాండుసుతునకున్
నిర్వచియించితి వానికిఁ
బర్విన దుఃఖంబుఁబాప భారతకృష్ణా. 68

క. శరతల్పగతుఁడు భీష్ముఁడు
శరణంబని యాశ్రయింపఁ జయ్యనవానిన్
జరితార్థుఁ జేయుటకుఁ ద
త్పరతం జెందితివి వాని భారతకృష్ణా. 69

క. దేవాదిదేవ జను లే
భావంబున నాశ్రయింపఁ బడపడి నీవా
భావము వారలపై నిడి
పావనులుగఁ జేయుచుంటి భారతకృష్ణా. 70

క. నిరతము తత్వజ్ఞులు నిన్
బరతత్వం బనుచుఁ బొగడు వడువున నా సు
స్థిర బ్రహ్మచారి భీష్ముఁడు
పరమాత్మా! పొగడె నిన్ను భారతకృష్ణా. 71

క. సామాన్య మానవులు నినుఁ
బ్రేమంబున బొగడురీతి భీష్ముండు పరం
ధామా! నీ యవతార
ప్రాముఖ్యము చెప్పి పొగడె భారతకృష్ణా. 72

క. న్యాయాఽన్యాయంబులు మఱిఁ
జేయఁగఁ దగు కర్మములను జెప్పఁగ నా గాం
గేయుని నియమించితి వవి
పాయక ధర్మజుఁడు వినియె భారతకృష్ణా. 73

క. అవసానంబున భీష్ముం
డవహిత చిత్తంబుతోడ నచ్యుత! నీ మూ

పవలోకించిన పర మను
భవమునకును దెచ్చినావు భారతకృష్ణా. 74

క. పరసుఖము నిచ్చు పుత్రుఁడు
పరమసుఖం బిచ్చునట్టి భార్యయుఁగాలెన్
బరగితివని గాంగేయుఁడు
పరమాత్మా! పొగడెనిన్ను భారతకృష్ణా. 75

క. శాంతనవుని మరణమునకుఁ
జింతిల్లెడు గంగ కెటులఁ జెప్పినదుఃఖం
బాంతమునొందునో! యటులనె
వంతను బోఁ దోలినావు భారతకృష్ణా. 76

క. నిజమగు వైరాగ్యమునను
వృజినము లడగించువాక్య వివరణమున ధ
ర్మజు దారుణమగు దుఃఖ
వ్రజమును బోఁగొట్టినావు భారతకృష్ణా. 77

క. సమరంబునఁ జెప్పిన ధ
ర్మము భగవద్గీతయెల్ల మమతవిడిన క
ర్మమె యని యర్జునునకుఁ ద
త్త్వము నుపదేశించినావు భారతకృష్ణా 78

క. తెలిపితివి యోగమహిమను
నిలిపించితి యోగదృష్టి నిర్మలభావం
బలవడఁ జేసితి నీదగు
బలమిచ్చితి వర్జునునకు భారతకృష్ణా.

క. సంకుచితంబగు బుద్ధి ను
దంకుఁడు నిను నిందసేయఁ దగువాక్యములన్
బొంకముగఁ దెల్పి బుద్ధిన్
వంకరదీర్చితివి దేవ భారతకృష్ణా. 80

క. పరుఁడస్థిరుం డసూయా
పరుఁడగు దుర్యోధనుండు పార్థుఁ డుదంకుం
డరయఁగ నీకొక్కఁటి యా
వరరూపముఁ జూపదేవ భారతకృష్ణా. 81

క. ఉత్తరకొడుకైన పరీ
క్షిత్తునకుం ద్రోణసుతుఁడు కీడొనరింపన్
జిత్తమునఁ దలఁచి వాని వి
పత్తును దొలఁగంగఁజేసి భారతకృష్ణా. 82

క. లోకేశ్వరునకు నైనను
జేకూరిన కర్మమెల్లఁ జేయకవిడువన్
జాకుండఁ జెప్పదను నుడి
ప్రాకృతులకుఁ దెల్పినావు భారతకృష్ణా. 83

క. ప్రతియుగమునందు నీవ
ప్రతిముఁడవై లోకమందుఁ బ్రభవించియు నీ
ప్రతిపక్షుల శిక్షింపను
బ్రతినయొనర్చితివి దేవ భారతకృష్ణా. 84

క. సంగులు కృష్ణుఁడు విష్ణుఁడు
రంగేశుఁడు లోకకర రాముండని ని

స్నాకులు తత్త్వం బని బహు
భంగుల నినుఁ బొగడు చుంద్రు భారతకృష్ణా. 85

క. కదనమునఁ బార్థునకు సా
రథివై గీతామృతంబు ద్రావఁగనిడి స
మ్మోదమున దానినె సజ్జన
వదనంబుల నిలిపినావు భారతకృష్ణా. 86

క. భక్తియు జ్ఞానము యోగా
స క్తియు వైరాగ్యములును సాధింప జనుల్
ముక్తిని బొందుదురఁట న
వ్య క్తతచే నెద్ది యెఱుఁగ భారతకృష్ణా. 87

క. నీ పాదకమలభక్తియు
నీపావన మంత్ర జపము నినుఁగనుటయు నెం
తో పారమార్థికంబును
బ్రాపింపఁగఁ జేయుమయ్య భారతకృష్ణా. 88

క. సంధియెడఁ జతురతయు నరి
బృందమునెడఁ బటుదలయు భీరులయెడ నిం
పొందెడుదయ దానవహరి
పంథీ! భువినీకె చెల్లు భారతకృష్ణా. 89

క. సారవిహీనంబగు సం
సారాంబుధి మగ్నునన్ను సరగునఁ బ్రోవన్
జేరి భవదీయనామ మ
పారదయన్ జూపితయ్య భారతకృష్ణా. 90

క. వసుదేవుని కొమరుఁడవై
వసుమతి జన్మించి నీవు పాండవులకు నీ
వసుధ యొసంగితి దుష్టుల
వసుధను ద్రెళ్ళంగఁజేసి భారతకృష్ణా. 91

క. (శ్రీ) వెలయు భారతంబు మ
హీవలయమునందు నెట్టు లింపొందెడినో
ఆవిధి బాలలకోమల
భావంబుల నిలుపుదీని భారతకృష్ణా. 92

క. భారత భాగవతంబుల
నారయ నీ చర్యవేఱ యనితలఁచిముదం
బారనినుఁ బొగడి తీవిధి
భారతకృష్ణా! యటంచు భారతకృష్ణా. 93

క. భారతము పరమవేదము
భారతవర్షంబు మిగులఁ బావనము మహా
భారతరణమతిచిత్రము
భారత లోకమున యందు భారతకృష్ణా. 94

క. వేదములలోనఁ బంచమ
వేదంబగు భారతంబు వివరింపమహా
వేదవిదులు తగరన నా
వైదుష్యమనంగ నెంత భారతకృష్ణా. 95

క. పారాశర్యుఁడు నీనుతి
భారతమునఁ జేయలేక భాగవతంబుఁ

గోరిరచించెను దాన న
పారంబగు తృప్తిఁజెందె భారతకృష్ణా. 96

క. సకలంబు విడిచి నిన్నే
యకలంకతఁ గొలుచు వారి కాదరమున "నా
నికటపద మిడుదుననుచును"
ప్రకటించితి గీతయందు భారతకృష్ణా. 97

క. శ్రీకృష్ణా యదుభూషణ
లోకేశ్వర సర్వభక్తలోలా గుణర
త్నాకర సజ్జనుత నినుఁ
బ్రాకృతులకుఁ బొగడ వశమె? భారతకృష్ణా. 98

క. దక్షా ఆశ్రితజనసం
రక్షా కరుణాకటాక్ష రాజీవాక్షా
రక్షస్సంహార పాండవ
పక్షా నినుఁగొలుతునయ్య భారతకృష్ణా. 99

క. నేరిచియో నేరకయో
భారతకృష్ణాఖ్య నిన్నుఁ బ్రస్తుతి సేయన్
గోరికతో నీశతకము
పారము నొందించియుంటి భారతకృష్ణా. 100

భా ర త కృ ష్ణ శ త క ము .

సం పూ ర్ణ ము .

శ్రీ శ్రీ శ్రీ

How fine and clear Bharata's tale
Echoes from uphill and down-dale
The learned hearts and cultured minds
View it full well that it binds
The lady world with notions sweet
Raw their ideas fairly to greet
The literary toil's credit
The authoress occupies fit.

T. V. N. ACHARIAR,
MEDALIST.

శ్రీ మత్పరదేవతాయైనమః.

మ. కనమత్తుంగ కళాసరస్వతులుగాఁ గాంక్షించు కాంతాళికిన్
వినతాఽనూనత మార్గదర్శినివియై విజ్ఞానతాదాత్రివై
యనవద్యోర్జిత గద్యపద్యకవితా ప్రాంచత్కళా చారుభూ
షిణివై కీర్తిని గాంచుచున్ మనుమి; లక్ష్మీకాంతసాధ్వీమణీ!

క. నారీమణులకు నెల్లన్
భారత కృష్ణాఖ్య శతక పఠనమువలనన్
భారత కథ సులభంబుగ
ధీరమతీ! దెలియు; నేల! దీని నుతింపన్.

ద్వివేది నారాయణశాస్త్రి,
పండితులు, రామా అండ్ కో.

ది 21—9—33